## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071424

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విన్నపము.

ఈపరమోత్కృష్టమైన వేదాంతగ్రంథము పూర్వాశ్రమంబున వెంపటిఅమ్మన్న యను పేర బరగిన బ్రాహ్మణోత్తమునిచే విరచింపబడియె. ధర్మం బేకపాదావశిష్టమై యొప్పారు నీకాలంబున లుప్తంబైన త్రిపాదంబుల తపోమహిమచే వెలయంజేసి పాదచతుష్టయ యుక్తంబగు ధర్మదేవతా నిజస్వరూపంబును బొడగాంచి చతురాశ్రమ ధర్మంబుల వర్తింపజేసిన మహనీయుండును, ఈశ్వరుండును భక్తపరిక్షార్థముగాను స్వవిలాసార్థముగాను కష్టములుగల్పించి భక్తుల శోధించు చుండునని కొందరి యభిమతము. కానివారలు,

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే।
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

అను గీతావాక్యార్థమును గమనించి ఆర్యులు వక్కాణింతురు. అనన్యమనస్కులై ఈశ్వర ప్రణిధానంబున గాలంబు గడుపు వారలకు క్లేశంబులు సంభవింపవను విషయము వీరి చరిత్రవలననే బోధవ్యము. గార్హస్థ్యంబున యుద్విధమైన కష్టంబు నెరుంగని పుణ్యపురుషుండు. నేత్రంబుల భక్త్యతిశయంబుచే జనియించిన ఆనంద బాష్ప స్రావమే కాని క్లేశానుభవ జనితంబులైన అశ్రుకణంబుల ప్రవహింప జేయలేదని తజ్ఞులకు తెల్లమే. గృహస్థుడుగూడా ప్రశాంతస్థితిని కాలము గడుపవచ్చునని వీరి చర్యలవలన లోకంబునకు విదితంబయ్యె ననుట అతిశయోక్తిగాదు.

శ్లో॥ ప్రీణాతియస్సుచరితైః పితరం స పుత్రః
యద్భర్తురేవ హితమిచ్ఛతి తత్కళత్రమ్।
తన్మిత్రమాపది సుఖేచ సమక్రియంతత్
ఏతత్త్రయం జగతిపుణ్యకృతోలభంతే ॥

యను ఆర్యవాక్యంబు, వీరి జన్మయందు సార్థకమయ్యె. " వరమేకో గుణీ పుత్రో నచామూర్ఖశతాన్యపి " యనునటుల శ్రీరాముంబోలె గుణియై పితృవాక్య పరిపాలనా నిరతియందు [illegible]డైన పుత్రుండును, పతిహితంబునే గోరుచు లోపా

ముద్రంబోలె భర్తకు జ్ఞానోదయంబును గలుగజేయు గృహిణీశబ్దంబును సార్థకంబు జేయు సాధ్వీతిలకంబగు పత్నియు, బాన్ధవ్యంబునను పాండిత్యంబునను పాణ్డవమధ్యమునకు కృష్ణునింబోలె అపర శంకరావతారం బనదగిన శ్రీగౌరీనాథశాస్త్రిగారను లోకప్రదీపకుండగు పుత్రశ్రేష్ఠుండును వీరి జన్మాన్తరార్జి తాత్యుత్కృష్ట పుణ్యవిశేషంబును లోకంబునకు వెల్లడి జేసిరని జెప్పక తప్పదు. గార్హస్థ్యంబు చిన్మార్గావరోధకంబుగా దలంచుట అసమంజస మని గుర్తింగి స్వచారిత్రంబువలన లోకంబునకు తెల్లముజేసిన పుణ్యపురుషుండు ఐహికంబున కష్టలేశ మెఱుంగక సుఖంబున సంసార సముద్రంబునీదిన పురుషశ్రేష్ఠుండు. ‘‘మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ యను ఉపనిషద్వాక్యాను సారముగ ప్రజాతన్త్వవచ్ఛేదార్థమును సాధుజనపోషణార్థమును రాజకీయోద్యోగమును స్వీకరించునను గృహస్థాశ్రమ ధర్మంబు లేశంబును విడనాడక షట్కర్మనిరతిని కాలంబు గడపుచు రాజసేవ స్వధర్మనిర్వర్తనంబునకు ప్రతిబన్ధక హేతువుగాదని లోకంబునకు వెల్లడి జేసిన ఉత్తమపురుషుండు. వీరి జన్మగాంచిన కొలది వీరి స్మరణ చేసిన కొలది స్మృతివాక్యంబులు యథార్థంబులనిబోధించుట కవతరించిన పుణ్యాత్ముండని స్పష్టమగును. ‘‘సత్యంపరం పరగ్ం సత్యమ్’’ యను వాక్యంబును అనుభవంబున సార్థకంబుగా జేసిన సత్యవ్రతుండు. బ్రహ్మచర్యంబున కుపమానా న్వేషణార్థము ద్వాపరంబునకు బోవనక్కరలేదు. గార్హస్థ్యంబున సామ్యంబు కొరకు త్రేతాయుగంబునకు జన నవసరంబు లేదు. తృతీయతురీయాశ్రమనిష్ఠుల గనుటకు ఋషివాటములకును పర్వతప్రాన్తములకు బోబనిలేదు. భీష్ముని బ్రహ్మచర్యనిష్ఠయు, జనకుని నిర్మోహత్వమును ఋషుల ప్రశాన్తస్థితియు సనకాదుల వైరాగ్యంబును కలికాలంబున వీరియందే దర్శితములయ్యె. షష్ఠిహాయన పర్యన్తము ప్రథమ ద్వితీయాశ్రమంబుల కాలంబుగడపి అనన్తరము షడ్వర్షంబులు వానప్రస్థ ధర్మంబుల నిర్వర్తించి ‘‘పరీక్ష్యలోకాన్ కర్మచితో బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన’’ యనునట్టుల కర్మవిముఖులై నిర్వేదంబు నొంది బ్రహ్మనిష్ఠులైనను ఆశ్రమగౌరవంబునను ‘‘దర్శనాదేవ సాధవః’’ యని యుండుట వలన లోకంబును పునీతంబుగా నొనర్చుటకును, లోకము తరించుటకును తురీయాశ్రమ వేషంబును స్వీకరించి ‘‘శాన్తామహాన్తో నివసన్తి సన్తో వసన్తవల్లోక హితంచరన్తః । తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనానహేతు నాన్యానపి తారయన్తః॥ యని నట్టుల దధీచి మహామునింబోలె కేవలలోకో

పకారార్థమే జీవయాత్రను గడపి అన్తేవాసుల నుత్తీర్ణులగావించిన శ్రీమత్పరమహంస శ్రీ సదానన్దేన్ద్రసరస్వతీస్వామివారిచే లోకానుగ్రహార్థమే ఈగ్రన్థము విరచింపబడియె.

శ్లో॥ అవిజ్ఞాతేపరేతత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా।
విజ్ఞాతేచ పరేతత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా॥

యనునటుల కేవల శాస్త్రజ్ఞానము నిరర్థకమనియు, అనుభవమే ప్రధానమనియు వీరిచర్యవలనను వీరి స్వానుభవంబునే సూచించు వాక్యములవలనను ప్రత్యక్షీకరింపబడుచున్నది. ప్రథమముద్రణకుపూర్వమే వారుసిద్ధినొందినందున వారి చేబరిష్కరింపబడు భాగ్యమును ఈగ్రన్థరాజము నోచుకొనదయ్యె. కాన దీనియందు ప్రమాదంబు లుండినను ఈ దృశగ్రన్థ పఠనాభిలాషులగు విద్వదవతంసులచే దోషంబులు క్షన్తవ్యంబులు.

శ్రీమద్దుందుభిసంవత్సర
కార్తికశుక్లైకాదశీ జయవాసరము
విజయవాడ.

జమ్మి వెంకట్రావు.
డిస్ట్రిక్టుమున్సిఫ్.



# గ్రంథసమర్పణము.



మహావాక్య రత్నోత్పత్తి స్థానసూచికా గ్రంథావసరమును గూర్చి జంధ్యాల గౌరీనాథశాస్త్రిలవారును నేనును వారు లోకాంతర గతులగుటకు సుమారువారముదినముల క్రిందట ప్రస్తావించితిమిగనుకను వారికి నుపాధిసమాప్తివ్యవస్థ లేకుండ సంభవమైనది గనుకను ఈగ్రంథము వారికి సమర్పించఁదలచి ఈక్రింద వ్రాయువిధమున వారికి సమర్పణము చేయడమైనది.

కృష్ణయజుశ్శాఖీయులయినట్టియు, వేదాంత శాస్త్రమునందు విద్వాంసులయినట్టియు బెజవాడయను వ్యావహారికనామముగల కృష్ణా తీరవిజయవాడనగరతీర్థవాసులయినట్టియు పరమభాగవతోత్తములయి నట్టియు అపరోక్షజ్ఞానవంతులయి బ్రహ్మసాక్షాత్కారమునొంది జీవన్ముక్తులయి అనంతరము విదేహముక్తులయినట్టియు పూర్వము హూణ విద్యావిషయమందునుగూడ బీ. యె. యను బిరుదాంకమునొందినట్టియు కృష్ణాజిల్లా న్యాయసభాగ్రగణ్యవాదులలో నొకరైనట్టియు జంధ్యాల గౌరీనాథశాస్త్రిలను వ్యావహారిక నామధేయధారులకు వారియందు నాకుండు యత్యంతగౌరవశల్కసూచకోపహారముగ నాచేరచియింపబడిన ఈ మహావాక్యరత్నప్రభవావళి యను గ్రంథరాజమును అత్యాదరముతో నిందుమూలముగా నివేదించుచుంటిని.

సిద్ధార్థినామసంవత్సర మాఘబహుళ చతుర్దశీ బుధవారము మహాశివరాత్రిః (౧౮-౨-౨౦)

అత్యంతమిత్రుండును బంధువుడునయిన
వెంపటి అమ్మన్న (దతనంతరం శ్రీసదానందేంద్ర సరస్వతీస్వామి)

# విజ్ఞప్తి



ఈపుస్తకము నెంతశ్రమపడి ముద్రించినను ప్రమాదవశంబునఁ గొన్ని స్ఖాలిత్యము లుండవచ్చును కనుక తత్వజ్ఞాన వేదాంత పరిజ్ఞాత లందఱు నీగ్రంథము నవలోకించి ఇందుందు ముద్రణ లోపములను నాకుఁదెలిపి రేని పునర్ముద్రణము నందుఁ జేర్పించుచున్నాఁడను.

కాఁబట్టి బుధోత్తములను బ్రార్థించెదను, ఈద్వితీయ ముద్రణమునను సంభవించిన యాలశ్యమును గూర్చి దరఖాస్తుదారు లందఱు క్షమింతురు గాక — ఈగ్రంథము వలయువారు ఈదిగువ యడ్రసునకు వ్రాసి తెప్పించుకొన గలరు.

బందరు
చమ్మనగిరిపేట

ఇట్లు
వెంపటి శ్రీధరశాస్త్రి

గ్రంథము లుండుస్థలము

(1) వెంపటి శ్రీధరశాస్త్రిగారు — బందరు — చమ్మనగిరిపేట
(2) ఆర్యానంద ముద్రాక్షరశాలా — బందరు — బచ్చుపేట

వలయు వారు వీ-పీ-టపాలోగాని లేక సొమ్మంపించిగాని తెప్పించుకొనగలరు.

# విషయసూచికా.

ఈగ్రంథమును గుఱించి గ్రంథకర్తకు విజ్ఞాపనము.

విషయములు సమాప్తము.



# ఉపోద్ఘాత ప్రారంభః.

అస్మన్మిత్రులారా!

వేదము ఐహికాముష్మిక సుఖదాయకమును జ్ఞానప్రతిపాదకమును అసమానమును సర్వోత్కృష్టమును సర్వాస్తిక హిందూజనాభిమానమును మనమతమునకు ముఖ్యాధారమునునై దేదీప్యమానంబై వెలుఁగుచున్నదని యందరికిఁ గరతలామలకముగాఁ దెలిసినసంగతియే యైయున్నది, వేదము మంత్రమనియు బ్రాహ్మణమనియు రెండుభాగములుగ నున్నది ,,మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామధేయం,, అని యాపస్తంబులవారు చెప్పియున్నారు, యిట్లు శ్రీ విద్యారణ్య స్వాములవారు వేద ప్రకాశిక యను మతభాష్యములో కాండ ౧ ప్రపాఠకం ౧ క్రింద వ్రాసియున్నారు, ,,మంత్ర బ్రాహ్మణాత్మకో వేద,, యని మాధవాచార్యులవారును వ్రాసియున్నారు, ఉపనిషత్తులు మంత్రభాగములో నైనను బ్రాహ్మణ భాగములో నైనను అంతర్గతములు గాని వేరుభాగముకాదు, యిట్టి సమానరహితమగు వేద మంతయు నొక్కటిగ నేకరాసియై యున్నను కరుణారసపూరిత హృదయులయిన వ్యాస భగవానులు సర్వ జనోపకారముగ నట్టి వేదమును రూప విశేషముచే ఋగ్యజుస్సామములని మూడు శాఖలుగ విభజించి యుండిరి, ,,పాదేనార్థ ర్వేనచోపేతా వృత్తబద్ధా మంత్రాః ఋచః। గీతిరూప మంత్రాస్సామాని। వృత్తగీతి వర్జితత్వేన ప్రశ్లిష్టపఠితా మంత్రాయజూంషి,, యిట్లుపూర్వోక్త వేదప్రకాశికయందే పూర్వోక్త స్థానమందే వ్రాయబడియున్నది. యజుస్సు విషయములో ,, యజురిత్యయతాక్షరపాదావసానో మంత్ర విశేషః తజ్జాతీయ వచనోయజుః,, అని శంకరులవారు తైత్తిరీయానంద వల్ల్యుపనిషద్భాష్యములో వ్రాసిరి, అధర్వణ వేదమనునది పైన చెప్పిన మూడు రూపములు గాక వేరు రూపముగలది కాదు గాన ,,వేదాశ్చత్వారః,, యని వేదములునాలుగు అయినప్పటికిని రూపమును బట్టి ,, త్రయీవిద్యా ,, యనియే ప్రయోగములు

గానంబడుచున్నవి అందువలన 'త్రయీవిద్యా' యనునప్పుడు అథర్వణ వేదము అందులో చేరినది కాకనిన్ని ఆ ప్రయోగమువలన ఋగ్యజుస్సామ వేదములు మూడింటికే యర్థమనిన్ని కొందరు ప్రమాద వశమున యర్థం జేయుచున్నట్లు కనుబడుచున్నది. అథర్వణవేదీయ యగు పంచ చత్వారింశోత్తమ శిఖోపనిషత్తు నందు "తస్త్రియీ మయం సర్వార్థ దర్శనం ఋగ్యజుస్సామ రూపత్వాత్ త్రియీపరికీర్తితా। కార్యసిద్ధేన చతుర్థాపరికీర్తితా। ఋచో యజూంషి సామాన్యథర్వాంగిరస్తథా । చతుర్ణాత్ర ప్రధానత్వాత్ లింగాది త్రితయంత్రయీ। అథర్వాంగిరసం రూపంసామ ఋగ్యజురాత్మకం,, యనియున్నది గాన 'త్రియీవిద్యా' మొదలగు ప్రయోగములలో అథర్వణవేదం కూడ చేరియున్నదనిన్నీ గ్రాహ్యము. అందు యజుర్వేదం శుక్ల కృష్ణ యజుర్భేదంచే రెండుశాఖలుగ ప్రస్తుతం వ్యవహార మందున్నది. అందు ఋగ్వేదం యిరువది యొక శాఖలుగను యజుర్వేదం నూటతొమ్మిది శాఖలుగను సామవేదం వేయిశాఖలుగను అథర్వణ వేదం ఏబది శాఖలుగను ఆహత్య (మొత్తమున) వేయీ నూటయెనుబది శాఖలుగ విభజింపబడియున్నది ఒక్కొక్క శాఖకు నొక్కొక్క యుపనిషత్తు చొప్పున యుపనిషత్తులును నన్ని గలయున్నవి వానియందు సారతరమైన నూట నెనిమిది మాత్రం శ్రీరామ చంద్రులవారు శ్రీ హనుమంతులవారికి నుపదేశించిరి ఆకారణంబున నిప్పుడు జగంబునన్నూటెన్మి శతోపనిషత్తులు మాత్రమే సుప్రసిద్ధములై యున్నవి వానినామములు శ్లోక రూపముగను ప్రత్యేకంగను మహావాక్య రత్నావళ్యాశ్లేషయ పీఠికయను విషయంక్రింద జూపబడియున్నవి. యీ నూటనెనిమిది యుపనిషత్తులలో పది ఋగ్వేద గతములును పందొమ్మిది శుక్లయజుర్వేద గతములును ముప్పదిరెండు కృష్ణయజుర్వేద గతములును పదహారు సామవేద గతములును ముప్పదియొకటి అథర్వణవేద గతములును యయ్యున్నవి. అంత్యోపనిషత్తైన ముక్తికోపనిషత్తుయందు యీ విషయమంతయును వానివాని శాంతులును విరళముగ వ్రాయబడియున్నవి ముముక్షువులకు ముక్తికినొక్క

మాండూక్యమే చాలుననియు దానివలన జ్ఞానముగలుగునపుడు దశోపనిషత్తులును అందువలనను దృఢజ్ఞానము గలుగని యెడల ముప్పదిరెండుపనిషత్తులును కేవల విదేహ ముక్తికి అష్టోత్తర శతోపనిషత్తులును జదువవలయునని మొదలగు సంగతులు అట్టిముక్తికోపనిషత్తు యందే వ్రాయబడియున్నవి. ఏనో యుపనిషత్తులకు నేమేశాంతులో కూడ ఆయుపనిషత్తుయందే వ్రాయబడి యున్నది, వీనిలోవేనికి శ్రీమచ్ఛంకరాచార్యాది యేమహనీయులు భాష్యములు వ్యాఖ్యానములు జేసిరో పూర్వోక్త రత్నావళి పీఠిక యందే వ్రాయబడి యున్నదియయిన చెప్పిన ప్రకారము ముపదేశింపబడిన యీ ౧౦౮ యుపనిషత్తుల గ్రంధ బాహుళ్యము వలన పూర్ణముగ గ్రహించనశక్తుడయి హనుమంతులవారు యీ సర్వోపనిషత్తుల నుండి సారభూతమైన మహావాక్యముల నేటిసంపూర్ణ జ్ఞానసిద్ధి కొరకు నుపదేశించ గోరగా శ్రీరామచంద్రుల వారు అష్టోత్తర సహస్ర మహావాక్యముల నేరి వానినొకహారముగ జేసి మహావాక్య రత్నావళియను వ్యావహారిక నామముచే సుప్రసిద్ధ మయిన యట్టి హారమును హనుమంతునకు ధారణార్థ మనుగ్రహించి రనియు (అనగ నుపదేశించిరనియు)ను అందువలననాతడు దుఃఖ రహితుడై నుహాతృప్తినిబొంది మహా జ్ఞానియై శ్రీరామునితో ఐక్యమును బొందుట యను బ్రహ్మైక్యము నొందెను- యీ హారము అనుగ్రహించుటకు సందర్భమెట్లనిన శ్రీరామమూర్తి తన పట్టాభిషేక సమయమునందు మహా విద్వాంసులకును భక్తులు మొదలగు పరిచారకులకును పారితోషకములనిచ్చుచు హనుమంతునకు మాత్ర మేమియు నియ్యకుండెను అది సీతాదేవి కనిపెట్టి తన పతియైన శ్రీరాములవారిని ఇంతమందికి పారితోషికము లీయగా వక్క హనుమంతునికి మాత్ర మేమియు నొసంగక పోవుటకు కారణ మేమని యడుగగ నాతను కోతియనియు ఏమిచ్చిన ప్రయోజన మేమి యనియు వానర స్వాభావిక చేష్టలచేత వేనినైన బ్రద్దలు చేయుననియు, గాన నేమియు నవసరం లేదనియును జెప్పెను అందుకు సీతాదేవి యీ మాటల నంగీకరించక

తన కత్యంత ప్రియభక్తుడు గనుక తగిన పారితోషికము నతనికిగూడ నీయవలయునని నిర్బంధించగా శ్రీరాములవారు నొక గొప్ప నవరత్న హారమునుదెచ్చి హనుమంతుని మెడయందు వేసెను హనుమంతుడు ఆ హారమందలి ప్రతి రత్నమునుం దీసి యొక శిలచే బ్రద్దలు గొట్టెను అది శ్రీరాములు జూచి సీతను బిలచి చూచితివా నేనెంత జెప్పితినో యంతయయ్యెను. నీవు గొప్పవిలువగల హారము నిచ్చుదాక బాధించితివి యని యనెను. అప్పుడా దేవి హనుమంతుని బిలచి యేమోయీ మీ యయ్యవారు చెప్పినట్లే చేసితివి నాకు మా టదక్కించక బోతివి నీ నైసర్గిక గుణము మానక పోతివి యని యన్నంతలో హనుమంతుండు అమ్మా యేపూసలోనైన రామనామము గాని మఱి యే పరమార్థతత్వం గాని యుండు నేమో చూచుద మని నొక్కొక్కటినే బ్రద్దలుచేయగా నొక దానియందును అట్టినామంగాని తత్వంగాని గానబడదయ్యెను, గాన నవియన్నియు యుపలములు (గులక రాళ్లు) గాని తదన్యములు గావయ్యెను (సీతాదేవి) యనిప్రత్యుత్తరమిచ్చెను స్వామీ నీ వట్టి హారమిస్తివేమి, యని పలని యడుగగా ఆయన మందస్మిత ముఖుడై కొంతసేపు యూరకుండి చతుర్వేదోపనిషన్మహావాక్య రత్నావళియను హారందీసి తిరుగ కంఠాభరణముగ జేయగా (ఉపదేశించగా) అప్పుడా వానరమూర్తి వెనకటియట్లు ఈప్రతి వాక్యరత్నమును తిరుగ భిన్నంచేయగా యీ ప్రతిరత్న మందును తత్త్వమస్యాది మహావాక్య లక్ష్యుడైన పరమాత్మ తత్త్వమును హారమధ్యమం దచ్చు టచ్చుగ రామ నామములును గనుబడగ ఆ రత్నహారం నప్పుడు ధరించి అనగా పరమాత్మానుసంధానం చేసి సాక్షాత్పర బ్రహ్మ స్వరూపుడై యుండెను అని యొక పురాణగాథ వినుచున్నాము, కాంబట్టి ఈ మహావాక్య రత్నావళియొక్క ప్రభ, మహిమ యిట్టిదని గ్రహించి ముముక్షువులు యీ మహా గ్రంథమును బహు శ్రద్ధాభక్తి విశ్వాసములతో పదేపదే జదివి అనుభవజ్ఞుల పరమాయిత్మాను సంధానముం జేసిముక్తులగుటకు బ్రయత్నించెదరని తలచెదను. ఈహారమే హనుమంతున కుద్దేశించి మొదట సీతకివ్వగాయామె

రాముని యంగీకారాన సారముగ హనుమంతున కిచ్చినదని గ్రహిం
చఁదగియున్నది. మహావాక్యరత్నములు అష్టోత్తర సహస్రముగనుండెను
రత్నములలోకి వజ్రమెట్లో యట్లు యీ రత్నములలో వేద మొకటిం
టికి నొక వజ్రముగా నవి ఋగ్వేదమునకు ,,ప్రజ్ఞానంబ్రహ్మ,, అనియు
యజుర్వేద మునకు ,, అహం బ్రహ్మాస్మి ,, యనియు, సామ వేద మునకు
,, తత్త్వమసి,, యనియు, అధర్వణ వేదమునకు ,అయమాత్మాబ్రహ్మ,
యనియు, మహావాక్యములుగ స్థిరపడి యుండెను. ఇవియే సాధారణ
ముగ నందరకుఁ దెలిసిన మహావాక్యములై యున్నవి యీ నాలుగు
మహావాక్యములను పూర్ణముగ యనుసంధానం చేయగా బ్రహ్మ
సాక్షాత్కారం గలుగునుగాని యట్టి యనుసంధానమునకు ఈయష్టోత్తర
సహస్ర రత్నములును చాల సహకారులవును గాన వీనిని పూర్వోక్త
సందర్భములతో బాగుగశోధించి జనువగ జనువగ గలుగు జ్ఞానము
ప్రస్థానత్రయ శాంతి జేసి వేదాంతశాస్త్ర మును అనగాసూత్రభాష్య
గీతా భాష్యోపనిషద్భాష్యములను జనుపుట మూలముగ నపరోక్ష
జ్ఞానసాధనం చేదము అను ఉద్యమంవలనగలుగు జ్ఞానంకంటెనూ స్వా
త్మంలో మోక్ష మతిశయించు నట్లును ననిపలచెనను. సంసారతమస్సు
నుబోగొట్టుట యందీ మహావాక్య విచారము సూర్యబింబము వంటిద
గును కర్మభక్తియోగాదులు దీపములవంటి వగును. యిది నా యప
కృష్టానుభవంవలన తెలిసికొనిన యంశంగనుక నాబోటి యల్పజ్ఞులకు
గూడ వెల్లడించు చున్నాను. ఈ మహావాక్య ములలో కొన్ని కొన్ని
టికి సంపూర్ణ గ్రహమునకు పూర్వోత్తర సందర్భ శోధనం అత్యా
వశ్యకమయి యుండును అట్టి శోధనమునకుతద్రతోత్పత్తి స్థానము
తెలిసి కొనుటకుదగిన మార్గమెక్కడను గానరాకుంటిమి నేనిట్టి యభా
వపీడితు డయిన యాకరముల సాధించవలెనని నావిద్యా దారుఢ్యము
కును మించిన యుద్యమం నొకటిని ఉన్మత్తుని వలె మొదట పైబెట్టు
కొంటిని కాని కేవలం ఈశ్వరుని నిర్హేతుక జాయమాన కటాక్షం
చేత నెట్లోనట్లు కార్యసిద్ధియై పదియిరువది రత్నములకుదక్క శేషిం
చిన రత్నముల కన్నిటికి నుత్పత్తి స్థానమైన వేదము నున్నూ, ఉపని

గ్రహింప నశక్తుడనయి ఆశ్లేయసంఖ్యను మార్చనాకధికారములే దనితోఁచి ప్రతివాక్యమునకును ఆదిమాశ్లేయసంఖ్యావలంబనమే చేస్తిని. ఇదియు నత్యంతప్రయాసకరమేయై యితర గ్రంథసహాయముగూడ కావలసి వచ్చినది ప్రతివాక్యమునకు క్రిందనుత్పత్తిస్థానమును కనుపర్చుడమేగాక అన్ని వాక్యములకునూ ప్రకరణానుసారముగ అకారాదిసూచికగా ప్రతీకమును విద్యాది విదేహముక్త్యంత ప్రకరణమును తత్సంఖ్యయు తన్నామమును అందలి వాక్యసంఖ్యయును వేదనామమును ఉపనిషత్సంఖ్యయును తన్నామమును కొన్నిచోట్ల తదంతర్భాగములును కనుపరుచు నొకసూచిక బహు విపులముగ కూర్పబడి గ్రంథాంతమందు చేర్పబడినది. ఇదియే నాప్రధాన ప్రథమోద్దిష్టకార్యము యీ వాక్యములను శ్రీరామచంద్ర యతీశ్వరులను వారుసార్థాంతిక మహావాక్యములుగ విభజించి పదునూరు ప్రకరణములుగ విభజించిరి అందొక ప్రకరణం పునరపి అష్టధా విభజింపఁబడినందున మొత్తమునవిరువదిప్రకరణములుగానయ్యెను. నొక్కొక్క వాక్యమునకు ఆయా వేదమునుబట్టి పఠనాత్పూర్వమున్నూ పఠనానంతరమందున్న యథోక్తశాంతిని పఠించవలెను ఆయాశాంతుల కథలను బాగుగ గ్రహించిచెప్పుట చాల యానందకరంగ నుండును గాన వాని కథలను తాత్పర్యమును గూడ వ్రాస్తిని. యిట్టి లేఖనం వివిధభాష్య టీకానుసారముగ జేయబడినది. వేదాంత పారిభాషిక పదములకున్ను కొన్నిసంకేతిత సంఖ్యాంత పదములకున్ను మరికొన్ని ముఖ్యమైన విశేషపదములకున్ను ఒక యకారాదియనుక్రమణిక గూడ చదువరుల సౌలభ్యంకొరకును గ్రంథాంతమందు చేర్చబడినది. యీ వాక్యములు దేశ భేదముల చేత పాఠభేదములై యుండుటవలన నుత్పత్తిస్థానదర్శనంలో గాని సంఖ్యావిషయంలో గాని నింకనేవిషయంలో గాని వ్యత్యాసం లుండిననుండ వచ్చును గాన నివి యవసరానుసారంగను తమ బుద్ధ్యనుసారంగను బుద్ధిమంతులు సవరణ చేసికొన వచ్చును. శ్రీరామచంద్ర యతీశ్వరుల వారి మంగళాచరణమున్ను గ్రంథోపసంహారమున్ను గూడ

చేర్చబడినది. మహావాక్యరత్నోత్పత్తి స్థానములదర్శించు గ్రంధమొక్క-
డను యిది వరకు నెవరి వలనను రచియింపబడి యున్నట్లు కనుబడను
యిది విద్వజ్జనమునకు నొకయభీష్ట వస్త్వభావముగ నున్నట్లు యెంచి
,, కార్యం ప్రాగభావ ప్రతియోగి;, యను తార్కిక వాక్యానుసార
ముగ తదభీష్ట వస్త్వభావ ప్రతియోగిగ నీ గ్రంధము ప్రకటింపబూని
తిని కనుకనున్న యిదే ప్రథమ ప్రకటనం గనుకనున్నూ యిందు
స్థాలిత్యములు అనేకము లుండవచ్చును పెద్ద లట్టి స్థాలిత్యము లను
మన్నించి ముందు ముద్రణాలో నేను సవరించుకొనునట్లు నాకు విధించి
న్నీ గ్రంథముయొక్క- ఉపయోగావ్యవసరముల నున్నూ నైమైన సుగు
ణములున్న యెడల వానిని గ్రహించిన్నీ నాకు ప్రోత్సాహము గలుగ
చేయుదురనివిశేషముగ ప్రార్థించుచున్నాను యీగ్రంథంవ్రాయుటలో
సాధారణముగ సంలాపోచిత భాషా సరణిగనే వ్రాయడ మైనది
వ్యాకరణోక్తముగ వ్రాయుటకు విశేషముగ శ్రద్ధనివ్వలేదు గనుక
ఆంధ్ర పండితులు క్షమించ ప్రార్థితులు.

సిద్ధార్థినామ సంవత్సర మాఘ బహుళ చతుర్దశీ బుధవారము
మహా శివరాత్రిః (౧౮-౨-౨౦) విద్వజ్జన విధేయుఁడు వెంపటి
అమ్మన్న (తదనంతరం శ్రీసదానంద్రేంద్ర సరస్వతీస్వామి)

ఆదర్శ వాక్యములు — యధాజాత్యం ధన్యస్వరూప జ్ఞానంన
విద్యతే। తథాగురూపదేశేన వినాకల్ప కోటిశతైరపి । తత్త్వజ్ఞానం
నజాయతే (౫ మహా నారాయణోపనిషత్తు) గుశబ్దస్త్వంధకార
స్స్యాత్। రుశబ్దస్తన్నిరోధకః। అంధకార నిరోధిత్వా ద్గురురిత్యభి
ధీయతే (౫3 అద్వయతారకోపనిషత్తు) యీవాక్యములను పదే
పదే స్మరించుచు సత్కుల ప్రసూతుండును సమస్త వేదాంత సిద్ధాంత
వేత్తయు, సర్వభూత హితుండును, బ్రహ్మ విదుండును, సర్వదోష
రహితుండును నగు సద్గురుని వెదకి ఉపదేశించ బడవలెను,

# సార్థాంతిక శబ్ద పరిశంస.

ఈ మహావాక్య రత్నావళి యను గ్రంథము నందుండు వాక్యములు సామాన్య వాక్యములు గను అర్థాంతిక వాక్యములుగను విభజింపబడి యున్నవి, అందు సామాన్య వాక్యం లనగ నొక ఋక్కుయొక్కగాని శ్లోకం యొక్క గాని భాగం కాకుండ ప్రత్యేకంగ స్వతంత్ర వాక్యమై యున్నది, అదెట్లనిన ,, సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితిశాంత ఉపాసీత ,, ఇట్టి వాక్యములు ప్రతి ప్రకరణంలోను ప్రథమములో గొన్నియుండి యనంతరము అర్థాంతిక వాక్యములు ప్రారంభమవును. ద్వివిధ వాక్యములును గలియుట చేత సార్థాంతిక మహావాక్యములను పేరుచే ప్రసిద్ధ మవుచున్నవి, అర్థాంతికము లనగ నొక ఋక్కుయొక్క గాని శ్లోకంయొక్కగాని సగముచే నంతమునుబొందుచున్న వాక్యమని యర్థం, యిట్టియర్థమే కిరణావళి యను మహావాక్య రత్నావళి వ్యాఖ్యానమం దిట్లు వ్రాయబడి యున్నది.

,, అర్థాంతికంకిమిత్యత్ర సంహితాకాలే ఋగ్వ్రామాణామవసానమితిసంజ్ఞా । తేషామనసానాంక్రమకాలేసంధ్యభావాదర్థాంతిక మితిసంజ్ఞేతి వేదలక్షణేఽభిగతం । విధివాదవిచారుస్తులోచనే ద్రష్టవ్యః। అవిధేయబ్రహ్మాపాపకవిధి ఛాయాఽపన్నవాక్యాని। తానికానీత్యత్రాహ। సర్వమిత్యాదినా॥ ,,

ప్రతి ప్రకరణ మందును యెంతవఱకు సామాన్య వాక్యములో యెచ్చటినుండి యర్థాంతిక వాక్య ప్రారంభమో విషయసూచికయందు గనపర్చ బడినను గ్రంథమధ్యమందు వివరించబడియుండ లేదు అట్టి విచక్షణ సామాన్యముగా ననుభవ వేద్యమే, అయితే కొన్ని గ్రంథములయందు మాత్రం యట్టి విభజనముగూడ వ్రాయబడి యున్నది, అర్థాంతిక వాక్యము కుదాహరణము ,, ఆత్మానంచేద్వి జానీయాదయమస్మీతిపూరుషః। కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్॥

యీ శ్లోకమునందుండు రెండువాక్యములును రెండర్థాంతికి వాక్యములయి యున్నవి.

శ్రీ గురుభ్యో నమః.

శ్రీ మహావాక్య రత్నావళ్యాశ్రేయ పీఠికాదయః.

ఓమ్॥ అథకలుఋగ్వేదాది విభాగేన వేదాఃచత్వార ఈరితాః। తేషాం శాఖాహ్యనేకాః స్యుః॥ ఏకవింశతి శాఖాఋచః। నవాధికశతశాఖాయజుః। సహస్రశాఖాస్సామ్నః। పంచాశచ్ఛాఖా అథర్వణస్య। ఏకైకస్యాశ్శాఖాయా ఏకైకోపనిషత్। అహాత్య్రశీతి సహితశతాధిక సహస్రసంఖ్యాకా ఉపనిషదః। తాసుశ్రీరామచంద్రేణ రామదూతాయ సారతరోపనిషదష్టోత్తరశతసంఖ్యాకా ఉపదిష్టాః। తథాచముక్తికోపనిషత్ సాష్టోత్తరశతోపనిషన్నామ శ్లోకాలిఖ్యంతే॥

యీశకేనకఠప్రశ్న ముండమాండూక్యతిత్తిరిః। ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకంతథ ॥ ౧ ॥ బ్రహ్మకైవల్య జాబాలశ్వేతాశ్వోహంసఆరుణిః। గర్భోనారాయణోహంసో బిందునాదశిరశ్శిఖా॥ ౨ ॥ మైత్రాయణీకౌషీతకీబృహజ్జాబాలతాపనీ। కాలాగ్నిరుద్రమైత్రేయీ సుబాలక్షురిమంత్రికా ॥౩॥ సర్వసారంనిరాలంబం రహస్యం వజ్రసూచికం। తేజోనాదధ్యానవిద్యాయోగతత్త్వాత్మబోధకం॥౪॥ పరివ్రాట్త్రిశిఖిసీతాచూడా నిర్వాణమండలం। దక్షిణాశరభంస్కంధం మహానారాయణాహ్వయం॥ ౫ ॥ రహస్యంరామతపనం వాసుదేవచముద్గలం। శాండిల్యంపైంగలంభిక్షు మహచ్ఛారీరికంశిఖా॥ ౬ ॥ తురీయాతీతసన్న్యాస పరివ్రాజాక్షమాలికా। అవ్యక్తాక్షరంపూర్ణా సూర్యాక్ష్యధ్యాత్మకుండికా॥ ౭ ॥ సావిత్ర్యాత్మాపాశుపతం పరబ్రహ్మావధూతకం। త్రిపురాతపనం దేవీ త్రిపురాకఠభావనా॥ ౮॥ హృదయంకుండలీభస్మ రుద్రాక్షగణదర్శనం। సారతారంమహావాక్యం పంచబ్రహ్మాగ్నిహోత్రికం ॥ ౯॥ గోపాలతపనంకృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకం। శాట్యాయనిహయగ్రీవం దత్తాత్రేయంచగారుడం॥ ౧౦॥ కలిజాబాలిసౌభాగ్య రహస్యఋచముక్తికః ౧౧ ॥ ఇతి (ఈశాద్యష్టోత్తర శతో

పనిషదాం శాఖా భేదం దర్శయతి) తత్రదశోపనిషదః ఋగ్వేదగతాః। శుక్లకృష్ణభేదేన యజుషఏకపంచాశత్। తత్రశుక్లయజుష ఏకోనవింశతిః। కృష్ణయజుషోద్వాత్రింశత్।సామ్నఃషోడశ। అథర్వణ్యైకత్రింశత్। అహత్వాష్టోత్తరశతం। (అద్వైతాంపూర్వాచార్య ప్రకాశితత్వం దర్శయతి) తత్రగౌడపాదాచార్యైర్మాండూక్యోపనిషద్వ్యాఖ్యాతా। మచ్ఛంకర భగవత్పాదాచార్యైః దశోపనిషదః। పంచరుద్రాన్నృసింహతాపనీచ శంకరానందైః సదాశివచరణైస్స్వయంప్రకాశానందాద్యైశ్చద్వాత్రింశోపనిషదః। విద్యారణ్యాచార్యైరష్టోత్తర శతోపనిషదో వ్యాఖ్యాతాః। (మహావాక్య రత్నావళ్యాఖ్యాయికాయాస్త్రయోదశధావిభాగం దర్శయతి) ప్రకృతేతు। రామచంద్రేణోపదిష్టే రామదూతాయధీమతే। యీశాద్యష్టోత్తర శతోపనిషద్వ్యాసనాకపతే। విమజ్యాత్ర మహావాక్యరత్నావళిరుదాహృతా। విభావ్యతేవిభాగేన సాత్రయోదశధాపునః। తత్రాదౌవిధివాక్యాని బంధమోక్షపరాణిచ। అవిద్వద్ధేయవాక్యాని జగన్మిథ్యాపరాణిచ। అథోపదేశవాక్యాని జీవేశైక్యపరాణిచ। బహిస్సాన్మవిన్మననాఖ్యాని జీవన్ముక్తిపరాణిచ। బ్రహ్మానుభూతిరూపాని తత్సనాదిపరాణిచ। అష్టస్వరూపవాక్యాని ఫలవాక్యాన్యనంతరం। విదేహముక్తివాక్యాని లిఖ్యంతేఽన్విష్య తత్రనూతి। యస్స్వాశ్రమాచారద్వితపరివ్రారజితేంద్రియః। సోధికారీమహావాక్యరత్నావళ్యాసంచాపరః। వాఙ్పూర్ణ సహనావ్యాయం భద్రంకర్ణేభిరేవచ। పంచశాంతీః పఠిత్వాదౌపఠేద్వాక్యాన్యనంతరం - (వాక్యపఠనాంతేపి ఏతత్పంచశాంతయః పునరపిపఠనీయాః)

## తాశ్చ

### ౧. ఋగ్వేదమహావాక్యానాం.

హరిః- ఓం- వాఙ్మేమనసి ప్రతిష్ఠితా మనోమేవాచి ప్రతిష్ఠితమావిరావీర్మఏధి॥ వేదస్యమ ఆణీస్థశ్శ్రుతంమే మాప్రహాసీరనేనాధీతే

నాహోరాత్రైస్సం దధామ్యృతంవదిష్యామి సత్యంవదిష్యామితన్మామవతు తద్వక్తార మవత్వవతు మామవతువక్తారమవతు వక్తారం॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥ హరిః-ఓం ॥ ఇత్యైతరేయ ద్వితీయారణ్యకే సప్తమోధ్యాయః॥

దీనిస్వరముకుముంబై దేవనాగరీ ప్రతిలో ఆరణ్యక శాంతిపాఠమును చూడవలెను. యీ శాంతిఐతరెయోపనిషత్తుతో సంబంధించువరకు చతుర్ధాధ్యాయముగను ఆత్మషట్కషష్టఖండముగానుయున్నది, యిది యంత్యాధ్యాయముగ నొక్క పర్యాయమును శాంతిగ నొక్క పర్యాయము మొత్తమున రెండు పర్యాయములు పఠనాంతమున చెప్పవలయును. ఐతరేయశాంతికి నుత్తరశాంతియును గలదు, శేషించిన ఋగ్వేదోపనిషత్తులకు యథాప్రకారం ఆద్యంతముల రెండు పర్యాయములుచ లును. ఉత్తరశాంతియెట్లనిన,

ఉదితః శుక్రియందధే । తమహమాత్మనిదధే । అనుమామైత్వింద్రియం । మయిశ్రీర్మయియశః । సర్వఃసప్రాణః సబలః । ఉత్తిష్ఠామ్యనుమాశ్రీః।ఉత్తిష్ఠత్వను మాయంతుదేవతాః । అదబ్ధంచక్షురిషితం మనః । సూర్యోజ్యోతిషాం శ్రేష్ఠోదీక్షేమామాహింసీః॥ తచ్చక్షుర్దేవహితం శుక్రముచ్చరత్ । పశ్యేమశరదఃశతంజీవేమశరదశ్శతం। త్వమగ్నేవ్రతపాఅసిదేవ ఆమర్త్యేష్వా । త్వంయజ్ఞేష్వీడ్యః ॥ * మ్యనుశ్రీః ఇతిక్వచిత్పాఠః ।

ఈ క్రిందవ్రాయుప్రకారము ,, ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళిః- గ్రంథాంకః ౧౧. ఐతరేయోపనిషత్తు,, యందున్నది

వాఙ్మేమనసీత్యాది షష్టఖండరూప శాంతిస్థానే ఓంభూమిముపస్పృశేదిత్యాదివాగ్రస ఇత్యంతంశాంతేః పఠనేవికల్పేన సంప్రదాయః।

సేయుంయథా— హరిః-ఓం భూమిముపస్పృశేదగ్న ఇళానమఉఇళా నమఋషిభ్యోమంత్రకృద్భ్యోమంత్రపతిభ్యోనమోవోఅస్తుదేవేభ్యః। శివానశ్శంతమాభవసుమృళీకాసరస్వతిమాతేవ్యోమసందృశి । భద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాభద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరై రంగై స్తుష్టువాంస స్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః॥ (౧-౬-౧౬) శన్న ఇంద్రాగ్నీభవతా మవోభిశ్శన్న ఉఇంద్రావరుణా రాతహవ్యా। శమింద్రాసోమా సువితాయశంయోశ్శన్నం ఉఇంద్రా పూషణావాజసాతౌ॥ (౫-౩-౨౭) స్తుషేజనంసువ్రతంనవ్యసీభిర్గీర్భిర్మిత్రావరుణా సుమ్నయంతా। తఉఆగమంతుతఉఇహస్రువంతు సుక్షత్రాసోవరుణో మిత్రోఅగ్నిః॥ (౪-౭-౫) కయానశ్చిత్రఉఆభువదూతీసదావృధస్సఖా । కయాశచిష్ఠయావృత ॥ (౩-౬-౪) కస్త్వాసత్యోమదానాం మంహిష్ఠోమత్సదంధసః । దృఢాచిదారుజేవసు ॥ (౩-౬-౨౪) స్యోనా పృథివిభవానృక్షరానివేశనీ। యచ్ఛానశ్శర్మసప్రథాః ॥ (౧-౨-౬) ఓష్ఠాపిధానకులీదంతైః పరివృతాపవిః । సర్వస్యైవాచ ఉయాశానా చారుమామిహ వాదయేదితినాగ్రసః॥

వాఙ్మేమనసీతిశాంతిః టీక— వాక్-బ్రహ్మవిద్యను ప్రతిపాదించు గ్రంథపాఠమునందు బ్రవర్తించు నావాక్కు, మే-నాయొక్క- మనసి - మనస్సునందు, ప్రతిష్ఠితా - సర్వదా ప్రతిష్ఠింపఁబడినది, (అస్తు - అగుగాక) (మమ - నాయొక్క) నమః - మనస్సు, మే-నాయొక్క, వాచి - వాక్కునందు, ప్రతిష్ఠితం - ప్రతిష్ఠింప బడినది - (అస్తు-అగుగాక) మనస్సు సావధానంగా లేనియెడల సుప్తోన్మత్తప్రలాపమువలె అసంగతముగా మాట్లాడును, వాక్కుకు పాటవంలేనియెడల గద్గదధ్వనితో మాట్లాడును గాన వాఙ్మనస్సులకు అన్యోన్యానుకూలం

ప్రార్థింపబడెను. (హే) ఆవిః – ఓ ఆవిర్భూతమగు బ్రహ్మ చైతన్య
మా, మే – నాకొఱకు, అవిరేధి – నాయవిద్యను బోగొట్టుచు ప్రకట
మగుము (అవీఃయని దీర్ఘము కొన్నిపాఠములందున్నది అదిసే క్రమ
మయిన పాఠమయినయెడల ఛాందసమై యుండును (ఒక ఆవిశ్శబ్దము
బ్రహ్మవాచకమైన నామవాచకం. రెండవ అవిశ్శబ్దము ఉపసర్గము)
పూర్వోక్తప్రకారము పరస్పరానుకూలములగు ఓ వాఙ్మనస్సులారా!
మే నాయొక్క, వేదస్య – బ్రహ్మవిద్యను ప్రతిపాదించునట్టి నే జదివెడి
గ్రంథమునకు, ఆణీ – ఆనయన సమర్థములై, స్థః – ఉండి మే – నా
యొక్క, శ్రుతం – గ్రంథము అనగా నాచేత వినబడినగ్రంథ తదర్థ
జాతం, మాప్రహాసీః – మఱువబడినది గాకపోవుగాక. అనేన – యీ.
అధీతేన – అధ్యయనం చేయబడిన గ్రంథంచేతను, అహోరాత్రాన్ –
రాత్రింబగళ్లను, సంధధామి – సంయుక్తముగా చేయుదును. సోమరి
తనమును వదలి రాత్రింబగళ్లయందు అధ్యయనమును జేయుదునని
తాత్పర్యం. ఋతం – నేను జదివెడి గ్రంథంలో పరమార్థమునే, వది
ష్యామి – చెప్పెదను, సత్యం – యథార్థమునే. వదిష్యామి – చెప్పె
దను, ఇచ్చట ఋతసత్యములకు మానసత్వ వాచికత్వములచేత భేదం
గాన పునరుక్తి లేదు. మనస్సుచేత వస్తుయాథార్థ్యమును విచారించి
వాక్కుచేత పలుకుదును అని తాత్పర్యం॥ తత్ – ఆచెప్పబోవు బ్రహ్మ
తత్త్వం. మాం – శిష్యుడనగునన్ను, అవతు – రక్షించుగాక, తత్ –
ఆబ్రహ్మతత్త్వం, వక్తారం – బోధకులగు ఆచార్యులను అవతు–రక్షిం
చుగాక, మాం – శిష్యుడనగునన్ను, ఆవతు – బ్రహ్మంరక్షించుగాక,
వక్తారం – నాయాచార్యునిన్ని, ఆవతు– రక్షించుగాక ఇచ్చటనా
మవతు తద్వక్తార మవతు అనునవి సాధన కాలమందు విద్యోత్పత్తికి
ప్రతి బంధకములగు విఘ్నముల యొక్క పరిహారమును ప్రార్థించువా
క్యములు ఆవతుమాం ఆవతువక్తారం అనునవి విద్యోత్పత్త్యనంతరం
నందు అసంభావనా విపరీత భావనాజనక విఘ్నముల యొక్క పరిహార
మును ప్రార్థించువాక్యములు అవతు వక్తారం అను రెండవ పర్యాయం

చెప్పబడిన వాక్యం అధ్యాయ సమాప్తి సూచనకొఱకని తెలిసికొన దగినది ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః యని మువ్మారు చెప్పుట ఆధ్యాత్మికాది భౌతికాధి దైవిక తాపత్రయ నివారణ కొఱకును ఇతరవిఘ్నముల యుపశాంతి కొఱకునని తా॥

తా॥ టీకాంతర్గతమయియే యున్నదిగనుక వేఱుగ వ్రాయబడ లేదు, (భూమి ముపస్ప్రశేదిత్యాది పాఠముకును నుత్తర శాంతి పాఠమునను నిచ్చుట గ్రంథవిస్తరభీతిచే నర్థం వ్రాయబడలేదు

౨ శుక్లయజుర్వేద మహావాక్యానాం.

హరిః- ఓం, పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే। పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥ ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః॥

హరిః- ఓం- ఇతి ౧ బృహదారణ్యకే సప్తమాధ్యాయె ప్రథమం బ్రాహ్మణం [ ఇది ౧౮ అవశిష్ట స్వరూప వాక్యములలో 3-వ వాక్యములు గూడ అగుచున్నది)

౧- టీ॥ అదః=పరోక్షముగ నున్నదియు, పూర్ణం=బ్రహ్మముచే పూర్ణమయినదియు, పూర్ణాత్ =పూర్ణముకన్న, (పూర్ణముగానున్నదని యూహింపబడిన జగత్తుకన్న) పూర్ణం= పరిపూర్ణమయిన బ్రహ్మము, ఉదచ్యతే=అతిక్రమించుచున్నది, పూర్ణస్య= పూర్ణమైన బ్రహ్మయొక్క, పూర్ణం=పూర్ణమును, [అహం బ్రహ్మస్మి యను భావం] ఆదాయ= గ్రహించి [పొంది] పూర్ణమేవ=అసంగమైనకూటస్థస్వరూపబ్రహ్మమే,అవశిష్యతే-శేషించుచున్నది

౧. తా॥ సమస్తము పరిపూర్ణమైన బ్రహ్మమే ఒక పాదమునమండి పూర్ణముగనున్నట్లు గనబడు మాయాకార్యమైన జగత్తునతిక్రమించుచు బ్రహ్మము పూర్ణముగనున్నది, ఉపాధులునశింపగ కూట చైతన్యమే పరిపూర్ణబ్రహ్మమై శేషించుచున్నది.

౨- టీ॥ ఈశాంతి ఏడు ,పూర్ణ, యను పదములతో కూర్చబడియున్నది. అదః = తత్పదలక్ష్యార్థమైన పరబ్రహ్మ, పూర్ణం=

దేశకాలవస్తుపరిచ్ఛేద రహితమై సర్వవ్యాపకమయినది, ఇదం=ఈ నామ రూపాత్మకమై కనబడుచు సోపాధికమయి జగము (వ్యవహారాపన్నము గనుక) పూర్ణం = తనరూపముచేతనే (పరమాత్మ చేతనే) వ్యాపింపబడినది. పూర్ణం=కార్యాత్మక బ్రహ్మ, పూర్ణాత్ = కారణాత్మక బ్రహ్మవలన, ఉదచ్యతే = అతిశయించుచున్నది [కారణమైన పరమాత్మభావమును విడిచి పెట్టుటలేదు) పూర్ణస్య = కార్యాత్మకమైన బ్రహ్మయొక్క, పూర్ణం=పూర్ణతను ఆదాయ= తీసికొని, (కారణసత్తగల దానినిగా తెలిసి అవిద్యవలన గలిగిన భేతవ్యవహారమును పరిహరించి) (స్థితస్య) జ్ఞానినః=ఉన్న బ్రహ్మజ్ఞానికి, పూర్ణమేవ= ప్రజ్ఞాన ఘనైకరస స్వభావమయిన కేవలబ్రహ్మ మేఅవశిష్యతే = మిగిలియున్నది.

౨- తా॥ సకలోకనిషత్ప్రతి పాద్యమైన యీ పూర్ణ పదార్థమే యీ మంత్రం చేత అనువదించ బడుచున్నది. కార్య కారణాత్మకమయిన నామరూపాది వ్యవహారముచే నానా విధములుగా వేరు వేరు ఉపాధులతో కూడికొనిన యీ జగత్తు అవిద్యా కల్పితమయినది గనుక దీని కధిష్ఠాన మయిన పరిపూర్ణ బ్రహ్మ స్వరూపము సర్వం ఖల్విదం బ్రహ్మయను శ్రుతి బలముచేత కార్యమైన జగము కారణ బ్రహ్మకంటె వేరు సత్తగలది కాదని ఆపరిపూర్ణబ్రహ్మనుగా తెలిసికొన్న విద్వాంసుడు, ఆరోపిత దేహోపాధి భ్రాంతి నశించగా తాను పరిపూర్ణబ్రహ్మ మాత్రుడై మిగిలి యుండునని తాత్పర్యం. రజ్జువు నందు కల్పితమైన సర్పమును దానివలన గలిగిన భయకంపాదులును రజ్జువును తెలియ గానే యవి యచ్చటనే లయించి రజ్జు మాత్రమే శేషించి అజ్ఞానకల్పిత సర్పభయ కంపాదులు నశించి జ్ఞానానందము లువచ్చినట్లుగా బ్రహ్మ సాక్షాత్కారము కాగానే అవిద్యకములైన భ్రాంతులు నశించి స్వరూపానంద బ్రహ్మసాక్షాత్కారము నిర్బాధకంగానుండును ముమ్మారు శాంతిని పఠించుట ఆధ్యాత్మికాది భౌతికాధి దైవిక తాపత్రయ నివారణము కొరకును యితర విఘ్నముల యుపశాంతి కొరకునని తాత్పర్యము.

### 3. కృష్ణయజుర్వేద మహావాక్యానాం.

హరిః - ఓం- సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యంకరవావహై । తేజస్వినావధీతమస్తుమావిద్విషావహై॥ ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః॥ హరిః -ఓం - కృష్ణయజుర్వేదతైత్తిరీయశాఖోపనిషదానంద

౧

టీః- నౌ =శిష్యాచార్యులమగుమాయిద్దరిని, సహ = కూడ, అవతు = రక్షించునుగాక, నౌ= శిష్యా చార్యుల మగుమాయిద్దరిని, సహ=కూడ(బ్రహ్మ=పరబ్రహ్మము)భునక్తు-అనుభవింపచేయునుగాక, సహ = కూడ, వీర్యం = సామర్థ్యమును (విద్యానిమిత్తక మైనసామర్థ్యమును) కరవావహై = చేయుదుముగాక, అధీతం = అధ్యయనముచేయబడినది(మాయిద్దరిచేతనుచదువబడినది) నౌ = మాయిద్దరికిని, తేజస్వి = తేజోవంతమైనది,అస్తు = అగునుగాక (అర్థజ్ఞానయోగ్యమైనదగునుగాక) (ఆవాం = శిష్యాచార్యుల మగుమేమిద్దరమున్నా) మావిద్విషావహై = విరోధమును పొందకపోదుముగాక (మాయిద్దరికినియేదైనను ప్రమాదమువలన ద్వేషముకలిగినేని అది లేకుండా బోవునుగాక) శాంతిశ్శాంతిశ్శాంతిః = ఈశాంతి త్రయము ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక తాపత్రయముకొరకును విద్యావిఘ్నముయొక్కశమంకొరకును యని యెరుగవలయును.

తాః - ముందుపఠించ బోవు పరబ్రహ్మ విద్య శిష్యాచార్యులమగు మమ్ము నిద్దరిని రక్షించునుగాక - మాయిద్దరికిని పరబ్రహ్మానుభవము కలుగజేయును గాక - మాయిద్దరికిని బ్రహ్మవిద్యానిమిత్తమైన సామర్థ్యముకలుగునుగాక - మాచేత నధ్యయనముచేయబడినది తేజోవంతమగునుగాక - శిష్యాచార్యులమగు మాయిద్దరికిని ప్రమాదమువల్లనైనను అన్యాయమువల్లనైనను ద్వేషము కలుగకపోవునుగాక - శాంతియగునుగాక - ఇట్లు ప్రార్థనాపూర్వకముగా ముందు పఠించబోయెడి వాక్యముల యొక్క విఘ్ననాశము కొరకు శాంతినిజేసి అవిఘ్నముగా శిష్యునిచేత బ్రహ్మవిద్యాప్రాప్తి కోరబడుచున్నది యని తాత్పర్యము.

## ४. సామవేదమహావాక్యానాం.

ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్రమథోబల మింద్రియాణిచ సర్వాణిసర్వంబ్రహ్మోపనిషదం మాహంబ్రహ్మనిరాకు ర్యాం మామా బ్రహ్మ నిరాకరోద నిరాకరణ మస్త్వనిరాకరణంమే అస్తుతదాత్మనినిరతేయ ఉపనిషత్సుధర్మాస్తేమయిసంతు తేమయిసన్తు॥ ఓంశాన్తిశ్శాంతిశ్శాంతిః॥ ఇతి — ఛాందోగ్యోపనిషద్యష్టమప్రపాఠకే పంచదశఖండేద్వితీయంవాక్యం। ఉపనిషదంత్యవాక్యంచ।

టీః - మమ= నాయొక్క, అంగాని= అవయవములను, వాక్= వాక్కును, ప్రాణః= ప్రాణమును, చక్షుః= నేత్రమును, శ్రోత్రం= చెవియును, అథోబలం = అథోముఖ వృత్తియందు సామర్థ్యముగల మనస్సును, సర్వాణి= అన్ని, ఇంద్రియాణిచ = ఇంద్రియములును, ఆప్యాయంతు= తృప్తిపొందుగాక. ఉపనిషదం= వేదాంత ప్రతిపాద్యమైన, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము, సర్వం = సకలమగును. అహం= నేను. బ్రహ్మ = పరమాత్మను మానిరాకుర్యాం= నిరాకరించకుందునుగాక. మాం= నన్ను. బ్రహ్మ = పరమాత్మ. మానిరాకరోత్ = నిరాకరించక యుండుగాక. అనిరాకరణం= ఆదరము. అస్తు= కలుగుగాక. మే = నాకు, అనిరాకరణం = విశ్వాసము, (లక్ష్యభావము) అస్తు= అగుగాక. తత్ = ఆ, ఆత్మని= బ్రహ్మమందు, నిరతే = ఆశక్తిగల. మయి = నాయందు, యే= ఏ, ఉపనిషత్సు= వేదాంతములందు చెప్పబడిన, ధర్మాః = ధర్మములో, తే = అవి, సంతు = ఉండుగాక. ద్విరుక్తి ఆదరమును సూచించును) ఓం = ప్రణవస్వరూపమగు పరబ్రహ్మమా, శాంతిశ్శాంతిశ్శాంతిః= విఘ్నములు పరిహరించుదువుగాక.

తాః - సామవేదార్థసారభూతమైన తత్త్వమసి మహావాక్యార్థనిశ్చయప్రకారము త్వంపద వాచ్యుడైన జీవుని యొక్క అవయవములగువాక్కు ప్రాణము నేత్రములు శ్రోత్రములు మనస్సు మొదలైన సకలేంద్రియములను విషయాదులందు ప్రవర్తించ నివ్వక త్వంపద లక్ష్యభూతుడైన ప్రత్యగాత్మోన్ముఖ మానటులజేసి జహదజహల్లక్షణా

చేత ప్రత్యగాత్మను తత్పదలక్ష్యమైన బ్రహ్మమందు అసిపదముచేత నైక్యపరచి సర్వం బ్రహ్మమను ననుభవానందము పొందుటకై పర [illegible]ంసలక్షణముచేత సద్గురుడనియు విలక్షణముచే పరమాత్మయనియు, అధికారియైన ముముక్షువు తనకు గురుబోధయందును ఆబోధకు లక్ష్యమైన పరమాత్మయందును అనిరాకరణము అనగా అలక్ష్యత లేకయుండుగాక యనియు సద్గురుడును పరమాత్మయు తన్ను నిరాకరించక భ్రాంతిసముదాయములోబడనివ్వక ఆదరింతురుగాక యనియు బ్రహ్మానుభవమును అపేక్షించిన తనయందు వేదాంతములయందు చెప్పబడిన శమదమాదులు మొదలైన యావద్ధర్మములు కలిగియుండుగాక యని ఆహ్వానింతు అని శాంతిని యుచ్చరించుట ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములయిన విఘ్నములయొక్క పరిహార నిమిత్తమని పెద్దలు చెప్పుదురు. ఆధ్యాత్మిక మనగా శరీరమునాధారము చేసికొని పుట్టునట్టి జ్వరము తలనొప్పి వ్రణము మొదలగు వానివలన గలిగిన తాపములు అధిభౌతికములనగా దయ్యము రాక్షసుడు పులి సింహము మొదలగు భూతముల ద్వారా గలుగు బాధలు. ఆధిదైవికములనగా దైవవశముగా పిడుగు మెరుపు మొదలగువానివలన గలుగు తాపములు ఓం అనిశాంతికి పూర్వము స్మరించుట సమస్తక్లేశ పరిహార మూలకముగా విఘ్నములేక జీవ బ్రహ్మైక్య జ్ఞానోదయ లాభము కొరకని తెలియవలెను.

### ౫. అథర్వణ వేద మహావాక్యానాం.

భద్రంకర్ణేభిశ్శృణుయామ దేవాభద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరైరంగైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమదేవహితంయదాయుః॥ స్వస్తినఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినః పూషావిశ్వవేదాః । స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః। స్వస్తినోబృహస్పతిర్దధాతు॥ ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః॥ హరిః॥ ఓం॥

ఇతిఋగ్వేదే ప్రథమాష్టకే షష్ఠాధ్యాయే షోడశ వర్గాంతర్గతే ఋచౌ॥ తస్మిన్నేవ వేదే ప్రథమమండలే ఏకోనవింశతితమసూక్తాంతర్గతేఋచౌ॥

(ఈఋక్కులు మొదటిపక్షము అథర్వణవేదమందున్నట్లుపఠించవలెననియు అట్లు అందులేనియెడల ఆదిమవేదమైన ఋగ్వేదమందున్నట్లు పఠించవలయుననియు యజుర్వేదారణ్యకశాంతిపఠనము ఇచ్చట వర్తించదనియు నాయభిప్రాయమేగాక ఇప్పుడు పరలోకగతులయియున్నట్టియు యజుశ్శాఖీయులయినట్టియు వేదాంతశాస్త్రపండితులయినట్టి బెజవాడయను వాడుకపేరుగల విజయవాడ కాపురస్థులయినట్టియు కృష్ణాతీరవాసులైనట్టియు బ్రిహ్మశ్రీ జంధ్యాల గౌరీనాధ శాస్త్రిలవారియొక్క యభిప్రాయము మైయున్నది గాన ఋగ్వేదపాఠానుసారముగనే వ్రాయడమయినది పెద్దలెవరైననింక యజుర్వేదపాఠానుసారముగ పఠించవలెనను యభిప్రాయులయిన యెడల అట్లే పఠించేది. భద్రం కర్ణేభిరితి శాంతిః అని చెప్పుట వలన ఆయొక్క ఋక్కే చెప్పవలెనా లేక స్వస్తిన ఇంద్రోయన్నదిగూడ చెప్పవలెనా యను సంగతిగూడ విచారణీయమైయున్నది ఋగ్వేదములో ‹స్వస్తిన› యనునదియే ముందుగను ‹భద్రం› యనునదియే తరువాతగను వ్రాయబడియున్నది

టీ॥ దేవాః =ఓ దేవతలార, వయం=గురుశిష్యులముముముక్షువులగుమేము. కర్ణేభిః = కర్ణములచేత, భద్రం=మంగళమును అనగా మంగళకరమైన వాక్యములను, శ్రుణుయామ=వినుచున్నాము,(ఓ దేవతలార మీ మంగళ వాక్కులను చెవులార వినుచున్నామని యర్థము) యజుత్రాః=పూజ్యులయిన యజ్ఞదేవతలారా, అక్షభిః= కన్నులచేత, భద్రం = మంగళమైన మీరూపములను. పశ్యేమ=చూచెదం, అనగా మీమంగళమయిన రూపములను కన్నులారచూతుముగాక యనిఅర్థం) స్థిరైః = దృఢమైనట్టి, అంగైః = అవయవములచేతను, తలాభిః = శరీరములచేతను, తుష్టువాంసః= స్తోత్రమునుచేయుచున్నవారమగుచు, యదాయుః = ఏమాజీవితమైన ఆయుర్దాయముగలదో, తదాయుః =

ఆయాయుస్సును, దేవహితం = దేవతులకు ప్రియమగునట్లు, వ్యశే మ = చేయుచున్నాము. (అనఁగా మాజీవితకాలమంతయు దేవతులకు కృతజ్ఞులముగా నుందుమని భావము.) వృద్ధశ్రవాః = సర్వదిగంతవిశ్రాంతమైనకీర్తిగలిగిన, ఇంద్రః = దేవేంద్రుఁడు, (సకలయాగభోగకర్త) నః = మాకొఱకు, స్వస్తి = శుభమును, దధాతు = ఇచ్చుగాక, విశ్వవేదాః = సర్వజ్ఞుడైన, పూషా = సూర్యుఁడు, స్వస్తి = శ్రేయస్సును, దధాతు = ఇచ్చుగాక, అరిష్టనేమిః = శుభములకు ఆధారుడైన, తార్క్ష్యః = గరుత్మంతుఁడు, నః = మాకొఱకు, స్వస్తి= శుభమును, దధాతు = ఇచ్చుగాక, బృహస్పతిః = దేవగురువైన బృహస్పతి, నః = మాకొరకు, స్వస్తి = మంగళములను, దధాతు = ఇచ్చుగాక.

తా॥ ఆధ్యాత్మికాది విఘ్నపరిహారమూలకముగాను, సకలదేవతలయొక్క అనుగ్రహము తనకు సిద్ధించుటకును, సాంప్రదాయాభివృద్ధికొఱకును. అధర్వవేద శాఖాగతమైన ఉపనిషత్తులకు భద్రంకర్ణేభియనుశాంతిని జదివి మరియు నుపనిషత్తును చదువుచు దానియర్థమును విని దానిప్రకారమనుసంధానము జేయుట సాంప్రదాయవిదులు రాద్ధాంతము జేసిరి. మోక్ష పురుషార్థము ఉపనిషద్విచారజనిత జ్ఞానముచేతనే సంభవించును. కర్మాదుల నీశ్వరబుద్ధితో జేసిన సకలపాపక్షయమును జ్ఞానోత్పత్తియును గలిగి అజ్ఞానముచే నజ్ఞానము నశింపగా స్వరూపావస్థానరూపముక్తి తనంతటతానే యావిర్భవించును. ముముక్షువులు పలువురుగావున నిచట శ్రుణుయామాది బహువచనములు చెప్పఁబడినవి. కర్ణైః అని చెప్పుటకు కర్ణేభిః అని ఛాందసము గనుక [అదద్ధము] అనఁగ మార్పునొంద దగినదిగాదు. (ఈశాంతుల కర్థములున్నూ తాత్పర్యములున్నూ ఇక్కడ గ్రంథవిస్తరభీతిచే క్లుప్తముగ వ్రాయఁబడినవి. ఇంకనుద్గ్రంథములనుండియు భాష్యములనుండియు జదివి విశేషముగ గ్రహించి యానందించ గలరని కోరుచున్నాను] ఈశాంతులు మహా

వాక్య పఠనమునకు పూర్వమందును పరమందును జక్కగ నర్థానుభవముతో పఠించగోరెదను.

సంఖ్యాశాంతిసహిత అష్టోత్తర శతోపనిషన్నామావళీ.

౧. వాజసనేయసంహితోపనిషత్ । (ఈశావాస్య) శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః.

౨. తలవకారోపనిషత్ । (కేన) సామవేదీయా । ఆప్యాయన్త్వితి శాంతిః

౩. కఠోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౪. ప్రశ్నోపనిషత్ । అథర్వణవేదీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౫. ముండకోపనిషత్ । అథర్వవేదీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౬. మాండూక్యోపనిషత్ । అథర్వవేదీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭. తైత్తిరీయోపనిషత్ కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః

౮. ఐతరేయోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౯. ఛాందోగ్యోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః

౧౦. బృహదారణ్యకోపనిషత్ । శుక్లయజుర్వేదీయా—కాణ్వశాఖీయా । పూర్ణమద ఇతి శాంతిః

౧౧। బ్రహ్మోపనిషత్ కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః

౧౨. కైవల్యోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౧౩. జాబాలోపనిషత్ । శుక్లయజుర్వేదీయా— వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః. (తి శాంతిః)

౧౪. శ్వేతాశ్వతరోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వి

౧౫. హంసోపనిషత్ । శుక్లయజుర్వేదీయా—వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః

౧౬. ఆరుణికోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః

౧౭॥ గర్భోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥

౧౮॥ నారాయణోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౧౯॥ పరమహంసోపనిషత్ । శుక్లయజుర్వేదీయా వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః ॥ ౨౦। అమృతబిందూపనిషత్ ।

కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ ౨౧ ॥ అమృతనాదోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః ॥ ౨౨॥ అధర్వశిఖోపనిషత్। అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౨౩॥ మైత్రాయణ్యుపనిషత్। సామవేదీయా। ఆప్యాయంత్వితి శాంతిః॥ ౨౪॥ కౌషీతకబ్రాహ్మణోపనిషత్ । ఋగ్వేదీయా। వాఙ్మేమనసీతి శాంతిః॥ ౨౫ ॥ బృహజ్జాబాలోపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౨౬॥ నృసింహతాపనీయోపనిషత్। అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః ॥ ౨౭॥ కాలాగ్నిరుద్రోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ ౨౮॥ మైత్రేయోపనిషత్ । సామవేదీయా। ఆప్యాయంత్వితి శాంతిః॥ ౨౯॥ సుబాలోపనిషత్। శుక్లయజుర్వేదీయా వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః ॥ 3౦॥ క్షురికోపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ 3౧॥ మంత్రికోపనిషత్ । శుక్లయజుర్వేదీయా వాజసనేయిని । పూర్ణమద ఇతి శాంతిః॥ 3౨॥ సర్వసారోపనిషత్। కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ 33॥ నిరాలంబోపనిషత్। శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ। పూర్ణమద ఇతి శాంతిః॥ 3౪॥ శుకరహస్యోపనిషత్। కృష్ణయజుర్వేదీయా । సహసనావవత్వితి శాంతిః॥ 3౫ ॥ వజ్రసూచికోపనిషత్॥ సామవేదీయా। ఆప్యాయంత్వితి శాంతిః ॥ 3౬ ॥ తేజోబిందూపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ 3౭ ॥ నాదబిందూపనిషత్। ఋగ్వేదీయా। వాఙ్మేమనసీతి శాంతిః॥ 3౮ ॥ ధ్యానబిందూపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ 3౯॥ బ్రహ్మవిద్యోపనిషత్। కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౪౦॥ యోగతత్త్వోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౪౧॥ ఆత్మబోధోపనిషత్। ఋగ్వేదీయా। వాఙ్మేమనసీతి శాంతిః॥ ౪౨॥ నారదపరివ్రాజకోపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౪3॥ త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్। శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ। పూర్ణమద ఇతి శాంతిః॥ ౪౪॥ సీతోపనిషత్। అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః ॥ ౪౫ ॥ యోగచూడామణ్యుప

నిషత్। సామవేదీయా। ఆప్యాయంత్వితి శాంతిః॥ ౪౬॥ నిర్వాణోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః॥ ౪౭॥ మండలబ్రాహ్మణోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః॥ ౪౮॥ దక్షిణా మూర్త్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౪౯ ॥ శరభోపనిషత్ । అధర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౫౦॥ స్కందోపనిషత్। కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః ॥ ౫౧॥ త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్ । అధర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౫౨॥ అద్వయతారకోపనిషత్। శుక్లయజుర్వేదీయా। పూర్ణమద ఇతి శాంతిః॥

౫౩॥ రామరహస్యోపనిషత్ । అధర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః ॥ ౫౪॥ రామతాపనీయోపనిషత్ । అధర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౫౫॥ వాసుదేవోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః॥ ౫౬ ముద్గలోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః॥ ౫౭॥ శాండిల్యోపనిషత్ । అధర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౫౮॥ పైంగలోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః॥ ౫౯॥ భిక్షుకోపనిషత్ । శుక్లయజుర్వేదీయా। పూర్ణమద ఇతి శాంతిః॥ ౬౦॥ మహోపనిషత్। సామవేదీయా। ఆప్యాయంత్వితి శాంతిః॥ ౬౧॥ శారీరకోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ ౬౨॥ యోగశిఖోపనిషత్। కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౬౩॥ తురీయాతీతావధూతోపనిషత్ । శుక్లయజుర్వేదీయా ॥ పూర్ణమద ఇతి శాంతిః॥ ౬౪॥ సన్న్యాసోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః॥ ౬౫॥ పరమహంస పరివ్రాజకోపనిషత్। అధర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౬౬॥ అక్షమాలికోపనిషత్। ఋగ్వేదీయా। వాఙ్మేమనసీతి శాంతిః॥ ౬౭॥ అవ్యక్తోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః॥ ౬౮ ఏకాక్షరోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ ౬౯॥ అన్నపూర్ణోపనిషత్। అధర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౭౦॥ సూర్యోపనిషత్ । అధర్వణీయా । భద్రంకర్ణేభిరితి

శాంతిః॥ ౭౧॥ అక్ష్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవ
త్వితి శాంతిః॥ ౭౨॥ అధ్యాత్మోపనిషత్ । శుక్లయజుర్వేదీయా। వాజ
సనేయసీపూర్ణమద ఇతి శాంతిః॥ ౭౩॥ కుండికోపనిషత్ ।సామవేదీయా।
ఆప్యాయంత్వితి శాంతిః॥ ౭౪॥ సావిత్ర్యుపనిషత్ । సామవేదీయా ।
ఆప్యాయంత్వితి శాంతిః॥ ౭౫। ఆత్మోపనిషత్ ।అథర్వణీయా।
భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౭౬॥ పాశుపతబ్రహ్మోపనిషత్ ।అథర్వ
ణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౭౭॥ పరబ్రహ్మోపనిషత్ । అథ
ర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౭౮॥ అవధూతోపనిషత్ ।కృష్ణ
యజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥ ౭౯॥ త్రిపురాతాపిన్యుప
నిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥

౮౦॥ దేవ్యుపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౮౧॥
త్రిపురోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః ॥ ౮౨ ॥
కఠోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః । ౮౩॥
భావనోపనిషత్। అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౮౪॥ రుద్ర
హృదయోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః॥
౮౫॥ యోగకుండల్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవ
త్వితి శాంతిః॥ ౮౬॥ భస్మజాబాలోపనిషత్ । అథర్వణీయా। భద్రం
కర్ణేభిరితి శాంతిః॥ ౮౭॥ రుద్రాక్షజాబాలోపనిషత్ । సామవేదీయా।
ఆప్యాయంత్వితి శాంతిః ॥ ౮౮ ॥ గణపత్యుపనిషత్ । అథర్వణీయా।
భద్రంకర్ణేభిరితి శాంతిః ॥ ౮౯ ॥ దర్శనోపనిషత్ । సామవేదీయా ।
ఆప్యాయంత్వితి శాంతిః ॥ ౯౦॥ తారసారోపనిషత్ । శుక్లయజుర్వే
దీయా। పూర్ణమదఇతి శాంతిః॥ ౯౧॥ మహావాక్యోపనిషత్ ।అథర్వ
ణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః ॥ ౯౨ ॥ పంచబ్రహ్మోపనిషత్ ।
కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః॥ ౯౩ ॥ ప్రాణాగ్నిహో
త్రోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః ॥ ౯౪॥
గోపాలతపనోపనిషత్। అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౯౫॥
కృష్ణోపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః॥ ౯౬ ॥యాజ్ఞ

